# అమృత రాజీవం

కవితా
సంకలనం



# అమృత రాజీవం

(కవితా సంకలనం)

ప్రజాస్వామ్య వ్యవస్థలో నేడు
విలయ తాండవం చేస్తున్న
హత్యా రాజకీయాలపై
కవుల తీవ్ర ప్రతిస్పందన




రజతోత్సవ ప్రచురణ

సంపాదకులు :

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

ప్రచురణ :

యువభారతి రజతోత్సవ సంఘం
యువభారతి కార్యాలయం
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001

AMRITA RAAJIVAM : (Protest against Terrorism)
An Anthology of poems written by twentyfive poets, presented at the Kavi Sammelanam arranged by Yuva Bharathi.

---



Silver Jubilee Publication No. 139

First Edition : June 1992

Copies : 1000

Cover Design : Sri Seela Veerraju

**Price : Rs. 10/-**

Copies can be had from :
Yuva Bharathi
(A Literary & Cultural Organisation)
Andhra Saraswatha Parishath Buildings,
Tilak Road, Hyderabad-500 001

Printed at :
Padmavathi Art Printers
1-1-517/B/1,
New Bakaram, Gandhi nagar,
Hyderabad - 500 380.
Phone : 611413.



# యువభారతి
# రజతోత్సవ సాహితి

సమాజంలో సామరస్యాన్నీ సౌమనస్యాన్నీ కలిగించడానికి వెలిగించ డానికీ భాషా సాహిత్యాలను సాధనాలుగా గ్రహించి సాత్వికంగా కృషి చేస్తున్న సంస్థ యువభారతి. ప్రజాస్వామ్య పరిరక్షణం సంఘంలోని విభిన్నశక్తుల సముచిత సమ్మేళనంవల్ల సాధ్యమవుతుందని యువభారతి విశ్వాసం. ఈ విశ్వాసంతోనే ఇరవై ఐదు సంవత్సరాలుగా ప్రస్థానం సాగిస్తున్నది యువ భారతి. ఈ విశ్వాసమున్న సహృదయుల సహకార ప్రోత్సాహాలే మూలబలంగా ముందుకు సాగుతున్నది యువభారతి.

ప్రజాక్షేమం కోసం ప్రజానీకం ఎన్నుకున్న ప్రజాధికారానికి కార్య విధానరూపం ప్రజాస్వామ్యం. ఈ విధానం విభిన్న అభిప్రాయాలకు ఆహ్వానం పలుకుతుంది. వాటిని ఆదరిస్తుంది. ముందు వెనుకలు పరిశీలించి నిర్మా ణాత్మక దృక్పథంలో వాటిని ప్రయోగించి, ప్రయోజనాత్మకంగా రూపుదిద్దు తుంది. ఈ దృక్పథం ఈ ప్రజాస్వామ్య విధానంలో ఉన్నందువల్లనే ఆధునిక ప్రపంచం దీనిని అంతగా సమాదరిస్తూ వస్తున్నది. ఈ విధానంలో పాశవి కతకు చోటుండదు. దానవతకు తావుండదు. హింసకూ రక్తపాతానికీ దౌర్జన్యా నికీ ఏ రూపంలోనూ అవకాశం ఉండదు. ఉండకూడదు. ఈ అభిప్రాయం ఏ ఒక్కరిదీ కాదు. ప్రపంచ కళ్యాణాన్ని కాంక్షించే ప్రతి మనిషిది; ప్రతి మహర్షిది. ప్రతిమేధావిది; ప్రతి ప్రవక్తది. ప్రపంచ మేధావుల, మనీషుల ఆకాంక్షా ఆశయమూ ఇలా ఉండగా, దీనికి విపరీత ధోరణిలో ఈనాడు అక్క డక్కడా ప్రపంచంలో హింసా నినాదాలూ, తీవ్రవాదాలూ అతివేలమై అపూర్వ మైన రక్తపాతానికీ ప్రజాసంక్షోభానికీ దారితీస్తూ, మనం పెంచుకున్న ప్రజా స్వామ్య కల్పవృక్షాన్నే సమూలంగా పెరికి వేయడానికి ప్రయత్నాలు పలు

రకాలుగా తలెత్తుతున్న సంగతి సహృదయ పాఠకులకు తెలిసిందే. ఇలాంటి తీవ్రవాద క్రౌర్యానికి బలైపోయిన వ్యక్తులలో నిన్నమొన్నటి ఉదాహరణ ప్రజాస్వామ్యనేత, భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి. రాజీవ్‌గాంధి ఒక వ్యక్తి కాదు. అందరూ అంగీకరించిన పరమాదరణీయమైన ఒక ప్రజాస్వామ్య వ్యవస్థకు ఒక ప్రతినిధి. ఆయన ఘోరమైన హత్య ఈనాటి హత్యారాజకీయాలకూ విలయతాండవం చేస్తున్న ఈనాటి తీవ్రవాదానికీ పరాకాష్ఠ. ప్రపంచంలో ఆ ప్రజాస్వామ్యమూర్తి దారుణ హత్యను నిరసించని సహృదయుడు లేడు. నాయకుడు లేడు. సామాన్యుడు లేడు. ఆ హత్యను విని, చూసి, కలత చెందని సంస్థ లేదు. సంక్షోభానికి గురై కల్లోలితంకాని కవి హృదయం లేదు. ఆ క్రూర హత్యనూ హత్యారాజకీయాలనూ తీవ్రంగా ప్రతిఘటిస్తూ ప్రతిస్పందించిన ఇరవై ఐదు మంది కవుల అక్షర హృదయభావ సరస్సరంగాల సంపుటి ఈ 'అమృతరాజీవం'. ఇందలి కవితలన్నీ గతంలో యువభారతి ఏర్పాటుచేసిన కవి సమ్మేళనంలో, సమాలోచనంలో సహజకవి శ్రీ ఎం.ఎస్. రెడ్డి (మల్లెమాల) గారి ఆధ్యక్ష్యంలో కవులు గానం చేసినవే. ఒక్కొక్క కవిత 'అమృత జీవం' లోని ఒక్కొక్కదళంగా సహృదయులు సంభవించవచ్చు. యువ భారతి వేదిక సరస్సయితే ఈ సంపుటి ఒక రాజీవంగా భావించవచ్చు.

హత్యారాజకీయాలను తీవ్రంగా ప్రతిఘటిస్తూ కలాల గళాలను ముక్త కంఠంగా సమీకరించిన సాహితీసంస్థ యువభారతి. రజతోత్సవ సందర్భంలో ఈ సంపుటి వెలువడడం మరువరాని విశేషం.

మేము ఏర్పాటు చేసిన కవిసమ్మేళనంలో తమ కవితలను గానం చేసి, వాటిని మాకు అందించి, ఈనాడు కవితా సంపుటిగా, ఈ రజతోత్సవ ప్రచురణగా, ఇలా రూపొందడానికి ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించిన కవులందరికీ మా యువభారతి కృతజ్ఞతాపూర్వక అభివందనాలను సమర్పిస్తున్నది.

సహృదయలోకం ఈ సంపుటిని సమాదరిస్తుందని ఆశిస్తున్నది........

—సంపాదకులు

# ఇందులో

# అమృతరాజీవం

(కవితా సంకలనం)

ప్రజాస్వామ్య వ్యవస్థలో నేడు

విలయ తాండవం చేస్తున్న

హత్యా రాజకీయాలపై

కవుల తీవ్ర ప్రతిస్పందన

# అమృతరాజీవం

సహజకవి శ్రీ 'మల్లెమాల'

అది.... ఒక కాళరాత్రి, అఖిలావని గుండెల నొక్కసారిగా
కుదిపిన రాత్రి, తారకలు కుప్పగ కూలిన రాత్రి, భారతా
భ్యుదయము నష్టకష్టముల ముంచి హసించిన రాత్రి, కుట్రతో
చెదలు మహాగ్ని ఖండమును చేకొని మ్రింగినరాత్రి అక్కటా!

*

మంచుమల నుండి కన్యాకుమారి వరకు
ముసురుకొని యున్న చీకట్ల పసనడంచి
దేశమున దీప్తి నింపంగ దీక్షగొన్న
అరుణ కిరణుడు ఉదయాద్రి నస్తమించె

*

హేతువేదియైన ఎవరు హంతకులైన
నీతి బాహ్యమైన నీచమైన
రాతియుగపు చర్య రాజీవు హత్య! ఈ
మచ్చ ఎట్లు మనకు మాసిపోవు?

*

సారె సారెకు వేలాది జనులు తననె
భావి భారతనేతగా పరిగణించి
పలుకు జేజేల వానలో పులకరించి
ముందు కురికెడు సౌందర్యమూర్తి నాపి

వంగి పదములు స్పృశియించి దొంగభక్తి
నొలకబోయుచు దశదిశ లులికిపడెడు
విధముగా క్రూర మారణాయుధము ప్రేల్చి
భరత జనయిత్రి ముద్దుల పట్టి గూల్చ
ఎన్ని గుండెలు ఆ మేకవన్నె పులికి ?

*

ఆ కిరాతకి ధైర్యమేమైన గాని
స్వప్నమందైన ఊహింప సాధ్యపడని
పరమ దుష్కృతి క్షణములో జరిగిపోయె
వన్నె కోల్పోయి సత్యమ్ము చిన్నవోయె

*

భారత యుద్ధరంగమున పాపులు వ్యూహమొకండు పన్ని, యే
తీరున పార్థనందనుని దేహము ముక్కలు చేసినారొ ఆ
తీరున దేశ నాశనమె ధ్యేయముగా గల దుష్టశక్తులీ
మారణ హోమముం జరిపి మానవతన్ పరిమార్చి నారహో!

*

తమ సర్వస్వము దేశసేవ కొరకై త్యాగమ్ము కావించి, లో
కము నందుత్తమ జాతినేతలుగ పేర్గన్నట్టి తల్లిన్ సుతున్
క్షమియింపన్ తగనట్టి దోషులుగ నిందన్ మోపి; ఘోరాతి ఘో
రముగా చంపిన పాతకమ్ము మనలన్ రాపాడదే నిత్యమున్

*

విమల శాంతిని ఒకనాడు విశ్వమునకు
పంచిపెట్టిన నేలలో పావురములు
డేగలుగ మారి మమతానురాగములను
రూపుమాపెడు కాలమ్ము దాపురించె

*

ధర నహింసయె ఉత్తమ ధర్మమనెడు
సత్య సందేశ మెలుగెత్తి చాటినట్టి
గణ్య చరితగ నుతిగొన్న పుణ్యభూమి
నిత్య హత్యల కీనాడు నిలయమయ్యె

*

అదిగో చూడుడి భారతాంబ వదనం బాందోళనాయత్తమై
పదిలమ్మించుకయేనిలేని స్థితి సంప్రాప్తించె, నా ఉన్కికం
చెదలో ఆగక పొంగు దుఃఖమును తానెట్లో దిగన్ మ్రింగు, చ
ల్లదిగో! శోకరసాధిదేవతగ నే డాయమ్మ కన్పించెడిన్

*

ఇట్టి ఘోరకలిని ఇంకొక్క క్షణమైన
సాగనీయ మంచు శపథమూని
ఎల్ల ప్రజలు హింస కెదురొడ్డి పోరాడి
దేశమాత బాధ తీర్పవలయు

*

లేడు రాజీవు డిక మీద రాడటన్న
చింత యేటికి? లోకమున్నంత వరకు
అమృత రాజీవమై లక్షలాది ప్రజల
మానస సరోవరమ్ముల మనుచు నుండు

*

# నేత్రుటి కేక

డాక్టర్ సి. నారాయణరెడ్డి

రాతిమీద విసిరికొట్టిన గ్లాసులా
పొద్దుపొడుస్తున్నది
గుర్తుపట్టని మనిషి శవంపైన
కప్పిన గుడ్డలా
చీకటి పడుతున్నది.

కాలం కదులుతున్నది కట్టుకున్న మరకాళ్ళతో
దినచర్యలు సాగిపోతున్నాయి.
కరుచుకున్న కంటిరెప్పల్లో చొరబడ్డ
దిగుళ్ళముళ్ళతో.
మనం పీలుస్తున్నది ఊపిరికాదు
పక్కనే పొంచున్న ప్రచ్ఛన్నమృత్యువు వొదిలే
శ్వాస దుర్వాసన.
ఏ క్షణాన్ని తడిమి చూసినా
కొసవేళ్ళను కోసుకుపోయే దుర్వార్తల
రక్తం మరకలు.

ఎలా తిరుగుతున్నామో
ధైర్యం వేళ్ళను కొరికేసే
దైన్యం పురుగుల మధ్య.
ఎలా బతుకుతున్నామో
అనుక్షణం చీముపడుతున్న గుండె పగుళ్ళమధ్య.
మనిషి మనుగడ విశ్వాసంమీద.

పరస్పర కరస్పర్శతో
ప్రాణం పోసుకునే స్నేహకోశం మీద.
ఎవరు పసికడతారు
మెడవైపు నడిచొచ్చే దండనడుముకు
ముడివేసిన విస్ఫోటనం వుంటుందని.
పెరటి మొక్కలే పేలుడు శక్తులై
తోటమాలి తలను తునకలు చేస్తాయని
ఎవరు చెబుతారు భద్రతకు భాష్యం?
నిద్రపోతున్న ఆస్తుల
నిలువెత్తు దహనకాండల నిరోధానికి
ఎన్నివేల తుపాకులు కన్నుతెరవాలి.

హత్యల జెండాలెత్తి ఆటవిక నృత్యాలు చేసే
కిరాయి కసాయి మూకలను
చౌరస్తాలో నిలబెట్టి తగలబెట్టే
చట్టాల పెట్రోలు
ఏ సర్కార్ బంకులో దొరుకుతుంది?
పాపం ప్రజాస్వామ్యం!
మొలకు చుట్టుకున్న ఆ మూరెడు చీరను
ఎన్నిసార్లు లాగి పారేశారో
నోటిలో కుక్కిన లాఠీతో
ఎప్పుడో మాట పోగొట్టుకుంది సంఘనీతి.
బుర్రకాస్తా మిగిలున్న బుద్ధిజీవుల
ఆలోచనల భ్రూణహత్యలమధ్య
నెత్తిని చీల్చుకుపోయే నెత్తుటి కేక
సత్తుచెవులకు వినిపిస్తుందా?
ఎటుపోతున్నదో ఈ దేశం?
సమాధానరేఖ ఇంతలో కనిపిస్తుందా?

# ఏముంది ఇందులో అపూర్వం?

డాక్టర్ బోయి భీమన్న

హత్యా రాజకీయాలు!
అల్లరి గణాల విలయ తాండవాలు!
గూండాల నిలువు దోపిడీలు!
రౌడీల తుపాకీ రాజకీయాలు!

అయితే ఏమిటిట?
ఎందుకలా అరుస్తావు?

అరవకేం జెయ్యమంటావ్?
ఎంత భయంకరంగా వుంది దేశ స్థితి?
ప్రజాస్వామ్యం పబ్లిక్‌గా
హత్య చేయబడుతోంది!

నిజంగానా, నేస్తం?
అహల్యా వధ, బలి వధ, వాలి వధ
శంబూక వధ, ఏకలవ్య వధ
అభిమన్యు వధ, ద్రౌపదేయుల వధ
మోసంతో మహావీరుల వధలు
వైరవీలతో ప్రతిభావంతుల వధలు
ఎన్నో, ఎన్నెన్నో, ఎన్నెన్నో!

గత చరిత్ర పుటల నిండా
అంటిన పచ్చినెత్తురు మరకలన్నీ
రాజకీయ హత్యలే కావా?
బ్రతకడం కోసం పోరాటం
గెలిచిన వాడిది రాజ్యం!
ఏముంది ఇందులో అపూర్వం?

నేస్తం!
ఆదిలోనే ఆత్మహత్య చేసుకొన్న
ఇండియా అనబడే భారత్‌లో
హత్య చేయ బడడానికి ఇంకా
విలువైనదేం మిగిలి వుంది?

ధనం, పదవి, అధికారం, భోగం
లభించే వృత్తి రాజకీయాలే అయినప్పుడు
రాజకీయ వృత్తికి కనీసార్హతలు
అల్లర్లూ, హత్యలూనే అయినప్పుడు
సహజంగా జరుగున్న దానికి
ఎందుకంత బెంబేలు పడతావు?

మరిప్పుడు అంతకంటె
కొత్తగా పుట్టిన భయం ఏమిటి?
శవజాతికి హత్యాభీతి ఏమిటి?

జాతి శవంగా మారని ఆనాడు
దుష్ట శిక్షకులైన వీరులు పుట్టారు
ఈనాడు దుష్టులైన రౌడీలే వీరులు!
రాజ్యం వీర భోజ్యం!
అంటే రౌడీ భోజ్యం!

రాజ్యమంటే ప్రజలు, వాళ్ళ ప్రాణాలు,
వాళ్ళ ఇళ్ళు, ఆస్తులు, బస్సులు, రైళ్లు
కాదా?

కాదనే మగవాళ్లుంటే
బైటికి రండి!
ఉత్త పెన్నులతోనో
చెత్త వాగుడు తోనో కాదు,
ధర్మసంస్థాపనార్థాయ
యుద్ధాయ కృతనిశ్చయులై రండి!

# సత్యానికి హత్యాగండం

డాక్టర్ జె. బాపురెడ్డి

ప్రజాస్వామ్య భారతి చేయిచాచి
తన జాతకం చూడుమంది
తన చేతి గీతల తలరాతల రహస్యం విప్పి చెప్పమంది
"గతం కంటే ఘనంగా ఉంటుందనుకున్న
నా వర్తమానం
వల్లకాడై పోతూంది
ఉజ్వలంగా విరుస్తుందనుకున్న నా జీవితం
కటిక చీకట్ల గూటిలో
కాకిలా అరుస్తోంది
ఇక నా భవిష్యత్తు ఎలా ఉంటుందో
బాపూ నీవే చెప్పమంది"
బెదిరిపోయిన ప్రజాస్వామ్య భారతి.

''అమ్మా! నేను సాముద్రికుణ్ని కాదు, సామాన్యుణ్ని
జ్యోతిష్కుణ్ని కాదు, హేతుష్కుణ్ని" అన్నాను
సాముద్రికం తెలియక పోయినా
సత్యం తెలిసిన కవీ!
నా భవిష్యత్తు ఎలా ఉంటుందో భయపడకుండా చెప్పమంది.

తానుకన్న పీడకల ఏదో వాస్తవమై పోతుంటే
ప్రాణభయంతో పరితపించే ప్రజాస్వామ్యాన్ని చూశాను
ప్రజలకు ప్రాణంపోసే ప్రజాస్వామ్యానికే
ప్రాణభయం పట్టుకుంది
రాజకీయాలను నమ్ముకున్న రాజీవానన ప్రజాస్వామ్యం
ప్రజల అండదండల కోసం ప్రాకులాడే ప్రజాస్వామ్యం
ఆప్తులెవరో హంతకులెవరో అగుపించని చీకటిలో
దగాపడ్డ ప్రజాస్వామ్యానికి, ధైర్యం చెప్పేదెలా!

అమ్మా! ప్రజాస్వామ్యమ్మా!
హత్యారాజకీయాల వలలో
కులమతాల కుట్రలలో
చిక్కుకున్న సింహానివి నీవు
అకాల ఆపత్కాల ఎన్నికలకు
విధిలేని అసహాయ సాక్షివి నీవు

భూస్వామ్యాన్ని, ధనస్వామ్యాన్ని
బలస్వామ్యాన్ని భయస్వామ్యాన్ని
ఎదిరించిన ప్రజాస్వామ్యమా!
నీ హస్తంలో హత్యాగండం ఉంది
స్వార్థ సంకుచిత శక్తులు నిన్ను
సంహరించే ప్రమాదం ఉంది
ఏ గోదావరి లంకలోనో
ఏ కొండదారి డొంకలోనో
పొంచిఉన్న విషసర్పాలు
నిన్ను కాటేయాలని చూస్తున్నాయి

కలాలతో వ్రాయవలసిన చరిత్ర, కత్తులతో వ్రాస్తున్నారు
రాగంతో తడుపవలసిన ధరిత్రిని, రక్తంతో తడుపుతున్నారు
హద్దులులేని హింసారాక్షసి దేశపు సరిహద్దుల్ని పాలిస్తున్నది

ఏదో ఒకదాన్ని హత్యచేయందే
రాజకీయం లేదట
అందుకే నీవు నమ్ముకున్న
విద్యను విజ్ఞానాన్ని హత్యచేస్తున్నారు
స్వేచ్ఛను స్వాతంత్ర్యాన్ని చిత్రహింస చేస్తున్నారు
ప్రతిభకు ప్రగతికి శిలువ వేస్తున్నారు
న్యాయాన్ని నరికేస్తున్నారు
శాసనాలను పెరికేస్తున్నారు
శాంతినీ సమతనూ కొరికేస్తున్నారు
నీవు పంచిపెట్టిన మైత్రినీ మానవత్వాన్నీ మట్టిలో పాతిపెట్టి
గాంధీలను కాల్చేస్తున్నారు, దేశభక్తిని కూల్చేస్తున్నారు

కలలుకనే కన్నతల్లి కడుపును చీల్చేస్తున్నారు
అన్ని ఆ పదలను తట్టుకోగలిగే
నీ ఆత్మవిశ్వాసాన్ని హత్యచేస్తున్నారు

ఓట్లమీద బుల్లెట్లకాట్లు కనిపిస్తున్నాయి
అమాయకుల ఆలోచనల అంతరిక్షంలో
అబద్ధాల క్యాసెట్లు వినిపిస్తున్నాయి
ప్రజలకూ ప్రజాస్వామ్యానికీ మధ్య
విరోధాల అగాధాలు ఆవురిస్తున్నాయి
శుద్ధిలేని త్రికరణాలు దేనికదే దుర్బుద్ధితో విహరిస్తున్నాయి

అయోధ్యారామ చరిత్రాలయంలో
మేలుకొన్న ధర్మదీక్షా కమలాక్షి
దేశాన్ని రక్షిస్తానంటున్నది
ఆవేశాల గట్టుమీది ఆదర్శాల చెట్టుకొమ్మను పట్టుకొని
ఊగుతున్న జనహిత దళాలు
ప్రగతికి ప్రాణం పోస్తానంటున్నవి

త్యాగాల యజ్ఞకుండంలో
గాంధేయుల రక్తతర్పణంలో
ప్రభవించిన హస్తేందిర
ప్రజావిజయ రాజీవ పీఠం నుంచి
శాంతి సమతా జీవనామృతం పంచి పెడతానంటున్నది
ఓ ప్రజాస్వామ్య భారతీ! ఈ ప్రతిజ్ఞల హారతి తీసుకో
తన బిడ్డను తానే చంపడానికి
పన్నాగాలెన్నో పన్నే హిరణ్యకశిపుల బారినుండి
ఈ దేశాన్ని రక్షించడానికి
ఏదో నవ నరసింహావతారం
ఎత్తుతాడు భగవంతుడు
సత్యాన్ని హత్యచేయబూనే
శక్తులకు ఓటమి తప్పదు
ఎన్ని ప్రళయాలు వచ్చినా
నీ ప్రజాశక్తికి విజయం తప్పదు.

# ప్రజాస్వామ్య హత్య

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి

ప్రజాస్వామ్యహత్య
ప్రతిక్షణం జరుగుతోంది.
క్రూర చోర జారుల బారినుండి
ప్రజల్ని కాపాడే ప్రభుత్వం
ప్రజలే ఎన్నుకొన్న ప్రభుత్వం
క్రూరుల తుపాకీ గుండ్లలో
చోరుల కబంధ హస్తాలలో
జారుల రాక్షస రతిలో
ఒడలంతా తూట్లుపడి
నగలన్నీ దోచబడి
సొగసంతా నమలబడి
దీనంగా చూస్తున్నది
దిక్కులేక పడివున్నది
గొంతెత్తే శక్తి లేక
కొనవూపిరితో పడివున్నది.

మేధావులన్నవారు
మేతావులుగా మారి
గాట్లో గడ్డిమేసి
తొట్లో నీళ్ళు త్రాగి

బ్రతుకిచ్చే దౌర్భాగ్యం
భరతోర్వికి పట్టింది.
కోట్లున్న వాడికి తప్ప
వోట్లడిగే శక్తి లేదు
కండబలం వుంటేతప్ప
కానీకి కొరగాడు
నోటుకు తన వోటును
మందుబుడ్డికి తన మందబుద్ధిని
ధారాదత్తం చేసే
దాన వీర శూరులతో
పౌర వతంసులతో
భారతోర్వినిండి వుంది
ఓటంటే గాలికెగిరే కాగితం ముక్క
ఎలాగో అది చేజిక్కించుకోడమే లెక్క
ఓటుద్వారా కోటలో పాగా
ఆపయి చూడు తడాఖా
ఖజానాలోని గింజల్ని కలబడి బొక్కడంలో
పాలకపక్షులకు ప్రతిపక్షులకు పొటింవులు లేవు
వెనుక ముందులుతప్ప
ఇదీ నేడు జరుగుతున్న యథార్థ ప్రజాస్వామ్యం
అయిదేండ్లు ఆగలేక అయిదు నెలలకే
ఆకలితో ఆసనాలు మార్చుకొనే ధన స్వామ్యం.
అహింసామూర్తి బుద్ధుడు
అవతరించిన దేశంలో
సత్యాగ్రహయోధుడు గాంధి
జన్మించిన దేశంలో

హింసాపిశాచి నేడు
విలయతాండవం చేస్తున్నది
సత్యమన్నదేనాడో
సమాధియై పోయింది.
అర్ధరాత్రి వొంటరిగా
ఆడబడుచు మాటెందుకు
నడివీధిని పట్టపగలు
నాయకుడే నడవలేడు
శాంతియన్న నేత మేను
సహస్రశకలములైనది
గుర్తుపట్టరానంతటి
ఘోరరూపమెత్తింది
అతని మెదడు పుర్రెనుండి
అదృశ్యమైపోయింది
అతని ప్రాణవాయు వెగసి
అనంత విశ్వంలో కలిసింది
మనుషులే బాంబులై మసలుతున్న వేళ
నడ్డివిరిచి మర తుపాకి నడుస్తున్నచోట
భయం రాజ్యమేలుతోంది ప్రాణం గుప్పిటిలో వుంది
బ్రదుకుకే భద్రత లేదు ప్రజాస్వామ్యమెక్కడుంది?

ఒక కిడ్నాప్ ఒక హత్య
ఒక లూటీ ఒక లాఠీ
కనీసం మానభంగం
కథయైనా లేకుంటే
సగటు మనిషి దినపత్రిక
చదవని రోజొచ్చింది.

ఏకీభవించనోణ్ణి
పీక నొక్కి వేద్దాం
ఇల్లువాకిలి తగులబెట్టి
ఇల్లాలిని రేపుచేసి
పిల్లల గొంతు నులిమేసి
సాక్ష్యం చెప్పే కన్నుల్లో
శలాకలు గుచ్చేద్దాం
ఇదీ నేటి సంఘనీతి
ఎటుపోయెనో పాపభీతి

# ఏమి వ్రాయను !
# ఎవరినిగూర్చి వ్రాయను !

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి

దండ యెత్తుక వస్తున్న మనిషి
దండెత్తి వస్తున్నాడో
దండం పెట్టబోతున్నాడో
తెలియని నేను ॥ఏమి॥
దండలో వున్నది
దారుణాగ్ని జ్వాలలు
తనలో దాచుకొన్న బాంబో
ఎర్ర గులాబీల చెండో
ఎరుగని నేను ॥ఏమి॥

తలుపు తట్టుతున్నది
పలుకరించ వచ్చిన
పక్కింటి నేస్తమో
తలపై గురిపెట్టిన తుపాకి హస్తమో
తెలియలేని నేను ॥ఏమి॥

కౌగిలించుకొనే చేతులది
గాఢాభిమానమో! జేబు
కత్తిరించుకపోయే నైపుణ్యమో
గమనించలేని నేను ॥ఏమి॥

కాళ్ళమీదబడ్డ భక్తుడు
కానుకలు కురిపిస్తాడో
కాళ్ళు లాగి క్రింద పడేస్తాడో
కనిపెట్టలేని నేను ॥ఏమి॥

పోకిరి యెవడో పోలీసెవరో
అసలెవరో నకిలీ యెవరో
ఆడ యెవరో మగ యెవరో
అది పెన్నో లేక గన్నో
అంతుపట్టకున్న వేళ ॥ఏమి॥

ఏ బందు ఎపుడొస్తుందో - ఎందుకు వస్తుందో
ప్రతిపక్షాల బందో - ప్రభుత్వంవారి బందో
తలుపు మూయాలో - తెరువాలో
పనికి పోవాలో - పోరాదో
ఎరుకలేని కష్టజీవులు
భయం భయంగా - ఇంట్లో
పస్తులు పడివున్న వేళ ॥ఏమి॥

ఒక నాయకుణ్ణి దించాలనో
మరొకణ్ణి పెంచాలనో
భాష పేర ప్రాంతం పేర
మతం పేర కులం పేర
మనుషుల్ని విడగొట్టే
మారణ హోమంలో
చేయి నరికితే యింత
జీవం తీస్తే యింత - అని
వాడి కత్తులు చెలరేగి
వ్యాపారం చేస్తున్న వేళ ॥ఏమి॥

# నడుస్తున్న భారతం

'వాస్తుశిల్పి' శ్రీ బి. యస్. రెడ్డి

నాలుగు దశాబ్దాల
స్వతంత్ర భారతంలో
పంచవర్ష ప్రణాళిక లెన్నో వేశాము
ప్రాజెక్టు లెన్నో కట్టించాము
బడుగువర్గాలవారిని
బాగుచేయడానికి
బృహత్తర పథకాలు వేశాము
రిజర్వేషన్లు పెంచాము
స్కాలరుషిప్పు లిస్తున్నాము
తక్కువ ధరలో
ఇళ్ళు నిర్మిస్తున్నాం

అంతరిక్షనౌకలు ప్రయోగించి
దేశంలోని వివిధ ప్రాంతాలకు
అంతర్జాతీయ సమాచారం
అందజేస్తున్నాము
అగ్రరాజ్యాల ఆక్రమణలు
అరికట్టడానికి
అలీనదేశాలన్నింటిని
ఒక త్రాటిపైకి తీసుకొచ్చాము

అత్యవసర పరిస్థితులలో
శత్రువుల నెదుర్కోడానికి
"అగ్ని"లాంటి క్షిపణులను
సిద్ధం చేసుకుంటున్నాము
ఇన్ని చేసినా ఏదో
అర్థంకాని అసంతృప్తి
మనసును కలచివేస్తున్నది
మెదడును తొలిచివేస్తున్నది.

పాడిపంటలకు ప్రసిద్ధిగాంచిన
పంజాబులో తోటి సోదరులను
పిట్టలను కాల్చినట్లు కాల్చి
చంపుతున్నారు.
దేశమంతటా తీవ్రవాదుల
బెడద పెరిగిపోయింది

ప్రజాప్రతినిధుల సభాప్రాంగణములలో
మైకులకు బల్లలకు మధ్యజరిగే
మైరావణ యుద్ధం చూసి
మంచీ చెడు అనేది
ఎవరిని చూసి నేర్చుకోవాలో
అర్థంకాక సతమత మవుతున్నారు
సామాన్య ప్రజలు
పార్టీల వ్యవహారం చూస్తే
మరీ దారుణం
ఇద్దరు మనుషులుంటే
మూడు పార్టీలు పెడుతున్నారు
నీ దొక పార్టీ
నా దొక పార్టీ
మనిద్దరిది కలిసి మరో పార్టీ

పవరులో వున్నవారు తమ
కుర్చీ కాపాడుకోడానికి
పడరానిపాట్లు పడుతుంటే
ప్రతిపక్షంలో వున్నవారు
ఆ కుర్చీ లాక్కోడానికి
వేయిదారులు వెతుకుతున్నారు

పందొమ్మిదివందల నలభై ఏడులో
నలభైకోట్లు లేని జనాభా
ఎనభైతొమ్మిదినాటికి
ఎనభైకోట్లు దాటిపోయింది
పెరిగే జనాభాకు సరిపడే
ఉత్పత్తి జరగడంలేదు
చేసిన ఉత్పత్తిని కూడా
నాశనం చేస్తున్నాం
సమ్మెలు చేసి - బందులు జరిపి

దేశంలో ఎప్పుడూ కనీవినీ ఎరుగనంతగా
కులరక్కసి తాండవ నృత్యం
చేస్తున్నది
రామ్-రహీమ్ మధ్య
ఏం జరిగినా
తప్పుచేసిన వ్యక్తికి
శిక్షవేసే బదులు
వాడి కులానికో
వారి మతానికో
ఉరిత్రాడు వేయాలని
ప్రయత్నిస్తున్నారు
కొందరు ప్రబుద్ధులు

అన్యాయం - అక్రమం
అర్థంలేకుండా పెరిగిపోయింది
హింస అగ్నిపర్వతంనుండి
పరవళ్ళు తొక్కుతూ వచ్చే లావాలా
జనసామాన్యాన్ని ముంచెత్తుతుంది
మన కళ్ళముందే ఎన్నో
దారుణాలు జరుగుతుంటే
మౌనంగా వుండిపోతున్నాం
కళ్ళారా చూసిన కఠిన సత్యాన్ని కూడా
చెప్పడానికి భయపడుతున్నాం
చేసిన తప్పులు ఒప్పుకోడానికి
వెనుకంజ వేస్తున్నాం.

సోదరులారా
మనం నిజం చెప్పకపోతే
చేసిన తప్పులు
దిద్దుకోకపోతే
దేశానికి నిజాయితీ కలిగిన
నాయకత్వాన్ని అందివ్వకపోతే
ఇవన్నీ చేయడానికి మనం
ఆత్మవిశ్వాసాన్ని పుంజుకోకపోతే
మన దేశాన్ని - మన జాతిని
మనమే మంట కలిపినవారమవుతాం
భావితరాలవారికి తీరని
అన్యాయం చేసినవారమవుతాం.

# చెప్పనామరి!

డాక్టర్ వెలిచాల కొండలరావు

ఎంత ఊహించినా తట్టడంలేదు కదూ!
ఎందుకు జరిగిందో అంతపాటి ఆ అఘాయిత్యం
ఎంత తల నిమురుకొన్నా తట్టటంలేదు కదూ
ఎందుకు జరిగిందో అంతపాటి ఆ అవాంతరం.
అవును! ఎందుకలా చంపేశారు అతనిని, అన్నెం పున్నెం
ఎరగని
అంత అమాయకున్ని
అందరినీ అంత అందంగా, ఆనందంగా పలకరించేవాణ్ని
అచ్చ గులాబిలా అందరికీ సువాసనలు వెదజల్లేవాణ్ని
మొగిలి రేకుల్లా తేటయిన తెల్లనయినవాణ్ని
దేశమను దేవాలయంలో పూజకొరకు పూలు
వెదక్కుంటున్నవాణ్ని
ఎందుకు చంపేశారో ఊహకు తట్టడంలేదు కదూ!
చెప్పనా మరి!
సూటిగా దొరకదు జవాబు, మాటుగా చెప్పనా మరి!
ఎందుకు రాస్తారు తెల్లని గోడలపై నల్లని శిరాతో
ఎందుకు గీస్తారు ఎర్రని బస్సులపై తెల్లని సున్నంతో
ఎందుకు తగలెడ్తారు అన్నిసార్లు అన్నన్ని బస్సులనూ,
రైళ్ళనూ
త్రోవనూ త్రోవనూ కలుపుతూ తోరణాల్లా మెరసే ఆ
వంతెన్లనూ

రోడ్డు ప్రక్క రోజా పువ్వుల్లా తళతళలాడే ఆ చిన్ని చిన్ని
వాహనాలనూ
ఏవో, ఎవరివో, ఎట్టి వస్తువులవో అయిన ఆ చిన్న చిన్న
కొట్టులనూ
చిల్లర కొట్టులనూ
అవి ఎవరవివయినా అవి దేశానివే కదా అవి, ఎందుకు
తగలెడ్తారు ఆ చిన్న,పెద్ద గృహాలనూ, భవనాలనూ
కట్టడాలనూ
తుదకు ఎందుకు లాక్కెళ్తారు, కాల్చేస్తారు, కనబడకుండా
చేస్తారు
పెద్దవాళ్ళనూ, పిన్నవాళ్ళనూ, ఉన్నవాళ్ళనూ, లేనివాళ్ళనూ
తిట్టి చెబితే మాత్రమే చేసే ఉద్యోగులనూ, జవాన్లనూ
మరేం! అడగరేం ప్రశ్నలు వాటి గురించి
మరేం! అడగరేం దేశం ఎదుర్కొంటున్న పలు సమస్యల
గురించి
పలు సవాళ్ళ గురించి, పలు సంక్షోభాల గురించి
పలు జనాలు పడుతూ ఉన్న బాధల గురించి
హత్య హత్యే, హింస హింసే, విధ్వంసం విధ్వంసమే
అది మనిషిదైనా కావచ్చు, మరింకే దానిదైనా కావచ్చు
ఒక చెట్టును కొడితే చెట్టే కదా! అని పట్టించుకోనివాళ్ళం
ఒక చేను ఒక దొంగెద్దు మేస్తే, మేయనీలే మనది కాదుకదా
మనకేమని ముందుకు నడిచేవాళ్ళం
ఒకడు లంచం పుచ్చుకొంటూ ఉంటే మన చేతుల్లో ఏముంది
మనమేం చేయగలం అని పిసరంత కూడా పెదవి విప్పని
వారం
ఒక మాస్టారు పట్టుమని పది పాఠాలు కూడా చెప్పకుండా

నెలకు అయిదువేలు కళాశాల సొమ్ము కాజేస్తూ ఉంటే
కిక్కురుమనకుండా కుక్కినపేనులా పడి ఉండేవాళ్ళం
ఒక విద్యార్థి ఏమీ చదవకుండా ఎందులోనుండో దొంగ
చాటుగా వ్రాసి దోసెడు డిగ్రీలు పుచ్చుకొని
పట్టాలున్నాయి పదవేదని బుఖాయిస్తూ ఉంటే
'కిం' అని అనజాలక కిక్కు కొడతాడో ఏమో అని
భయపడేవాళ్ళం
ఒకడు బియ్యంలో ఇసుక కాక ఇసుకలోనే బియ్యం కలిపి
అమ్ముతూ ఉంటే గొణుక్కుంటూ, సణుక్కుంటూ
ఒకటొకటే
ఏరిపారవైచి మిగిలినవే మిక్కిలిగా సరిపెట్టుకొనేవాళ్ళం
రోడ్డు రొంపయ పోయి, రోకలిలోతు కందకాలేర్పడి
అడుగడుగునా అరచాలెడు బొడగరాళ్ళు వడివాహనాలకు
ముడిముళ్ళదారులేస్తూ ఉంటె
మూడుమూడు గజాలకు ముప్పయిసార్లు బ్రేకు వేయవలసి
వస్తూ ఉంటే బ్రతుకు జీవుడా అని భగాయించేవాళ్ళం
పెట్రోలులో గ్యాసు, నూనెలో ఆమిదం, గోధుమపిండిలో
వరిపిండి
వరిపిండిలో జొన్నపిండి, పసుపులో పచ్చకలరు, మిరపలో
ఎర్రకలరు, ఉప్పులోకూడా చప్పటిదేదో తుప్ప కలిపినా
మనరాత ఇంతేనని మాడుకొట్టుకునేవాళ్ళం
మాటాడకుండా ఉండేవాళ్ళం
ఎన్ని కర్మాగారాలు లాకౌట్లని మూసివేసినా, ఎన్ని
లక్షల ఉత్పత్తి ఘంటలు సమ్మెల్లో కొల్పోయినా
ఎన్ని ప్రాజెక్టులలో ఎన్ని కోట్ల రూపాయలు

ఎస్టిమేట్లు కిందు మీదులయి, నిర్మాణాలు నిరంతరాలయి
ఎక్కువ ఖర్చయినా
ఎన్ని సచివాలయాల్లో, ఎన్ని సంచాలకుల ఆలయాలల్లో
ఎన్ని కార్యకలాపాలు ఎంత కాలయాపన జరిగి
ఎంతో వ్యయం దుర్వ్యయమయినా
ఎందరో యువకులు యువతులు బురఖాలు తొడిగికొని
పోలింగు బూతులకు వెళ్ళి, ఎన్ని దొంగఓట్లు వేసివచ్చినా
ఎందరో ముక్కుపచ్చలారని పిల్లకుంకలు పెద్దవాళ్ళు ఇంకా
పోలింగ్ బూతులకు రాకపూర్వమే ఓటువేసి ధాటిగా సాగి
పోయినా
ఎంతోమంది ఎప్పుడో చచ్చినవారి పేరిట, ఇంకా పుట్టని
వారి పేరిట
వలసపోయిన వారి పేరిట, వాస్తవానికి లేనివారి పేరిట
తుదకు వారి వారి ముద్దు కుక్కలు, ముద్దు పిల్లుల పేరిట
మనుషుల్లా
పేరు నమోదు చేయించుకొని ఓట్లను కోట్లు చేసి
వేసే వారి గురించీ, వేయించుకునే వారి గురించీ
పట్టించుకోని వాళ్ళమయిన మనం
ఎందుకు, ఎందుకింత ఖంగారు పడుతున్నాం ఒక్క మనిషి
హత్య గురించి
ప్రతి హత్యకీ వీటిల్లో జవాబు లేదా?
కావా ఇవీ, ఇవన్నీ పరోక్ష హత్యలు
హత్య హత్య కావడానికి నెత్తురే ప్రవహించాలా
కన్నీళ్ళు కారితే చాలదూ
తెల్లని కన్నీళ్ళకూ, ఎర్రటి నెత్తుటి నీళ్ళకూ రంగు తప్ప
రంధిలో ఏంటి తేడా?

జీవార్థం కోల్పోయిన జీవనానికి జీవం కోల్పోయిన శరీరానికి
ఏంటి తేడా?

కావా, ఇవీ, ఇవన్నీ హత్యలకు మూలం
లేదా వీటిలో ఒకదానితో ఇంకొకదానికి
ఇంకొకదానితో ఇంకొకదానికి సంబంధం, అనుబంధం
ఖర్మ అని కళ్ళు మూసుకోవడం అసలేకాదు
ప్రతి పౌరుడూ క్రౌర్యంపై శౌర్యంతో విజృంభించాలి
అవినీతిపై, అరాజకంపై, అత్యాచారంపై, అచేతనపై
ఆకతాయిబ్రతుకుపై, అంగడి గతుకుపై, అక్రమంపై,
అన్యాయంపై, అసూయపై, దనాపై, దోపిడీపై,
దౌర్జన్యంపై, దౌష్ట్యంపై తిరగబడాలి తిరుగుబాటు చేయాలి
అంతవరకు ఇది ఇంతే
ప్రతి హత్యా, ప్రతి హింసా, ప్రతి ధ్వంసం, ప్రతి విధ్వంసం
ప్రశ్న తప్ప జవాబు దొరకని ఒక వింతే,
ప్రజాస్వామ్యమొక కుటుంబం
కుటుంబం కుటుంంబం కావాలంటే కావాలి కుటుంబీకులకు
త్యాగం, సహనం, సానుభూతి భావం, సమన్వయ భావం
ఏవీ అవి మన ప్రజాస్వామ్యంలో, ఎక్కడా అగపడవే,
ఎక్కడ చూసినా అగపడేది స్వార్థం, సంకుచితత్వం, ద్వేషం
రోషం, అసూయాభావం, అసహ్యభావం, అసహనభావం
ఇంత స్వార్థభావంలో, ఇంత సంకుచిత భావంలో
ప్రజాస్వామ్యమెలా బాగుపడుతుంది
ఇంత పాక్షిక భావంలో, పార్శ్యాలిటీ భావంలో సామ్యవాద
మెలా కొమ్మలు వేస్తుంది రెమ్మలు తొడుగుతుంది
ఇంత సంకుచిత వాతావరణంలో, ఇంత కులమత
ప్రాంత, ముఠా మూఢత్వ వాతావరణంలో సాంఘిక

భావం, సమతాభావం, సామాజిక భావం ఎలా
మొలకెత్తుతుంది, ఎలా మొగ్గేస్తుంది?
ఇంత క్షోభిత, సంక్షోభిత వాతావరణంలో
సౌమ్యుడయిన పౌరుడు ఎలా బ్రతికి బట్టకట్టగలడు
ఎలా బ్రతికి బయటపడగలడు?
అందుకే జరిగింది అంతటి అఘాయిత్యం అంతటి అవాంతరం
ఊర్కొంటే ఇంక జరుగుతాయి ఇంకెన్నో అఘాయిత్యాలు
ఇంకా జరుగుతాయి, ఇంకెన్నో, ఇంకెంతో ఉగ్రంగా
ఉధృతంగా, ఉన్మాదంగా అవాంతరాలు
ఊరోకవటం బ్రతకడం కాదు
కుములుతూ కూర్చోవడం అంతకన్నా కాదు

# ప్రజాస్వామ్య శిశుహత్య

డాక్టర్ వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు

(1)

కొలని నిండ నీరు; కొలనిపై తేలు రా
జీవ మొకడు కమ్మతావు లీన
బాడబాగ్ని దాని భస్మ మ్మొనర్చె; ము
న్నీరు వోలె కొలను నింగి కెగయ.

(2)

ఈ జనారణ్యసీమలో ఏది జనమొ
ఏది మృగమొ తెలిసికొను టెంతొ కష్ట;
మైన ఆ మృగమ్ములె సాత్వికాంశ వలన
జనములకు బుద్ధిచెప్పెడు సమయమయ్యె

(3)

ఈ ప్రజాస్వామ్య శిశుహత్య కించుకంత
జాలిపడని - సిగ్గుపడని జనుల కింక
మోక్షమే లేదు; స్వాతంత్ర్యమున కనర్హ
మైన జాతిగా నగుబాటు నయ్యె మనకు.

(4)

కనుక భారతీయులు దేశకాల పాత్ర
విజ్ఞులై అవశ్యమ్ము ప్రతిజ్ఞ పూన
వలయును "మన ప్రజాస్వామ్య పాలనా వ్య

వస్థ నెటులైన రక్షించువార" మనుచు.

(5)

తుక తుక లాడు గుండియలు, తొందర పెట్టెడు కార్యదీక్ష,
హిం
సకు తగు మం దహింసయె సుమా యని చెప్పెడు నేర్పు-
గల్గి జా
తికి ఘనరక్షగా నిలుచు ధీరత చూపుచు, దేశమాతృ పూ
జకు మన ప్రాణరక్షణము సత్వర కార్యమటం చెరుంగుడీ!

# ఎంత సేపు వల్లించను ?

శ్రీ కనమలూరి వెంకటశివయ్య

ఎంత సేపు వల్లించను
సత్యం కోసం సర్వం త్యాగం చేశాడొకడని
పావురాన్ని రక్షింపగ కాయం ఇచ్చాడొకడని
భగవద్గీతాసారం భరతావని పారిందని
ప్రేమమూర్తి బుద్ధుడు నా దేశమున పుట్టాడని
గత కాలం ఘనత నేను ఎంత సేపు చాటగలను
వర్తమాన కుటిలతపై వర్తమాన స్వార్థంపై
పురాకీర్తి గుప్పిట్లను ఎంత సేపు కప్పగలను
ఆత్మను నేనెంత సేపు ఎన్నింటిని కప్పగలను
వంచించుచు బ్రతుకగలను

మమతకాదు మతభూతం దూరెను మన దేహమ్ముల
కలం కాదు కత్తి వ్రాసె మన ఎన్నిక వ్యూహమ్ముల
మంచి పనులు చేసికాదు, మారణ హోమంతో
వంచనతో నడుస్తోంది ఎన్నిక పన్నాగం
ప్రత్యర్థుల బలంచూపి ఎదుట నిలిచి పోరరారు
ప్రాణం తీయగ బాంబులు వెనుకనుండి విసరుతారు
ఇలా ఉన్న దుర్మార్గపు సరళిజూచి శక్తిజూచి
ఎటుల నేను భారతీయ పౌరుణ్ణని గర్వంగా
గొంతు విప్పి చాటగలను పరదేశం వినేలాగ

సంతసాన ఎలా నేను బ్రతుకగలను - బ్రతుకగలను
జాతి పితను చంపిన ఆ సంస్కారం చూచి చూచి
నీతిమాలి రక్షకులే స్వామిని చంపంగ జూచి
పూలమాల వేయురీతి ముందుకురికి హత్యజేయు
నీలి రూపు దుర్మార్గుల క్రౌర్యమ్మును చూచి చూచి
మేలిమి రాజీవమ్మునుకిలల మసిచేసే దౌర్మార్గ్యం చూచిచూచి
సర్వం హింసాత్మకమో దౌర్భాగ్యం చూచి చూచి
గర్వంగా ఎలా చెప్పుకోను గళం విప్పి నేను
భారతీయ పౌరుణ్ణని, భరతావని నా గడ్డని
మేధావుల బోధాసుధ ఎద ఎదలో పారవలెను
స్వార్థరహిత ప్రజానేతృ సేవాధుని పారవలెను
వర్తమాన దుశ్శకుల ఆటల కట్టించవలెను
హింసాత్మక దౌష్ట్యమ్మును ప్రజాశక్తి కూల్చవలెను
కవులారా కదలిరండి
గళముల సారించండి
ఎన్నిక యుద్ధంలో ప్రత్యర్థుల చంపునీతి
బాంబుల వర్షించే దుర్మార్గపు దమన నీతి
ప్రజాస్వామ్య సీమంతినిపై అత్యాచారమ్ముచేయు
కుటిల నీచ గర్హనీయ దుర్మార్గపు రాజనీతి
ప్రత్యర్థ్యనుయాయుల ఆస్తుల ధ్వంసంచేసే దహననీతి
వైయక్తిక సమస్యలకు వర్గమ్ముల రంగు పులిమి
ఆందోళన లేవదీయు స్వార్థపరుల మనోరీతి
ప్రత్యర్థ్యనుయాయుల ఆస్తుల ధ్వంసంచేసే దహననీతి
అరికట్టగ కదలిరండి
భారతీయ ప్రజావళిని ప్రభావితుల జేయరండి
కవుల కలం కరకైనది కవుల వాక్కు బరువైనది

కవికంట కారేది కన్నీరుకాదు
కవి గుండె అను నిప్పు కొండశిఖరము జీల్చి
వెల్లుబికి ప్రవహించు లావాప్రవాహాలు
పాపాత్ములం గూల్చి గర్జించి వర్షించు
మేఘసలిలాలు
కవి నాస వదలేది శ్వాసమాత్రముకాదు
నాసా జగజ్జాత ప్రళయమారుతము
నయవంచకుల మాడ్చు చండోష్ణపవనమ్ము
కవి కలము వ్రాసేది పిచ్చికవితలుగావు
నీచ జంబుక తతిని కూల్చగా లంఘించు
మృగరాజ గంభీర భూరి గర్జాతతులు
అపర రావణ నరక దైత్యాధముల జంపు రామకృష్ణాభీల
హేతి సంతతులు

కవులారా కదలిరండి
గళముల సారించండి
ప్రజాస్వామ్య సంహరణం ఆపండి ఆపండి
ప్రజాస్వామ్య పతాకాన్ని
వినువీధుల కలకాలం
ఎగిరేలా చేయండి

# మందేహాతతి అస్థినిమజ్జనం!

శ్రీ ఎల్లోరా

ఇది నా దేశం!
అవును సగర్వంగా
చెప్పుకొంటున్నా
ఇది నా భారత దేశం!
మహామహుల నెందరినో
కన్న దేశం
మహానాయకులు ఎందరో
జన్మించిన దేశం!
ఇది నా దేశం
ప్రపంచ పరివ్యాప్తంగా
మహానాయకులుగా
నీరాజనాలు జేజేలు
అందుకొన్న ఎందరో
మహా నాయకులను
పొట్టను పెట్టుకొన్న
దేశం కూడా ఇదే!
ప్రజాస్వామ్యం
విరిసి విప్పారిన భూమి ఇది
వేద ధర్మం, ఆర్ష ధర్మం
ప్రవచించిన భూమి ఇది

అనేక సంస్కృతుల
సంగమ తీరం ఇది
భిన్నత్వంలో ఏకత్వం
వినిపించిన భూమి ఇది.
మానవత్వం పరిమళించిన
మహోన్నత శిఖరాగ్ర
చలువ పందిరి నా దేశం
ఇది చరిత్రలో చదువుకొని
మురిసిపోతున్న గతం ఇది!
ప్రగతి ప్రభా భాస్కర
కిరణాలతో సాగుతూన్న
మహారథం ఇది
మందేహతతి అడ్డుపడి
అకలావికలం చేస్తున్న ప్రస్తుతం ఇది!
ప్రజాస్వామ్యం ముసుగులో
హత్యారాజకీయాల అరాచకత్వం
వలలో జనస్వామ్యం ఉక్కిరిబిక్కిరి
చేస్తున్న దుష్టశక్తుల చిట్టావర్జాలను
పసికట్టాలి.
మనిషినిచూసి మనిషి
భయపడే రోజులు
తన నీడనే తాను నమ్మలేని
ప్రస్తుతం ఇది!
ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేస్తూ
జన జీవనాన్ని అతలాకుతలం చేస్తూ
స్వార్థపూరిత పన్నాగాల

పన్నగాల అంతర్యానికి
శస్త్రచికిత్స చేయాలి
మతాన్ని, నమ్మకాలనీ
రోడ్డు కీడ్చి
సభ్య ప్రపంచాన్ని అవమానం
పాలుచేస్తున్న దుష్టశక్తులకు
గుణపాఠం నేర్పేందుకు
ప్రజాస్వామ్యవాదులారా కదలిరండి
వెలుగు సముద్రంలో స్నానంచేసి
వెన్నెలరథం మీద
శాంతి కాగడాలు ధరిద్దాం
ప్రజాస్వామ్య పరిరక్షణకు
అగ్ని కవచాన్ని ఆవిష్కరిద్దాం!

# ఎర్రెర్రని ఆ రోజు

**శ్రీమతి సి. వేదవతి**

భయం వేస్తుంటుంది ఒక్కొక రోజు
ప్రొద్దున్నే మరీ పచ్చి నెత్తురు ముద్దల్లే
అగుపిస్తాడు సూర్యుడు
మండే కాష్ఠమల్లే పొడుస్తుంది పొద్దు!
అరుణ ఛురికమల్లే మీదమీదకు దూసుకు వస్తుంది
అప్పుడే అవతరించిన సూర్యకిరణం!
రుధిర స్నాతమైనట్లు రక్తాక్షరాలు
రాత్రికి రాత్రి నెత్తుటి లత్తుక పూసుకొన్నట్లు
ఎర్రెర్రని వార్తగా కళ్ళముందు నిలుస్తుంది!
ఆకాశం విరిగి ముక్క చెక్కలయినట్లు
జగత్తు యావత్తూ స్థంభించిపోయినట్లు
అయిపోతుంది కదా అట్టి నెత్తుటి వార్తను వింటే!
నా దేశం నాదై పోయినప్పటినుంచీ,
అచ్చంగా నాదే అయిపోయినప్పటి నుంచీ,
ఇలా అనుకొన్నాను సుమా!
ఇప్పటిదాకా ఈ ధరిత్రి మీద
ప్రోక్షించిన స్వేచ్ఛా సమర వీరుల రక్తంతో
పని ఇక తీరిందని!
భగత్‌సింగుల బలిదానాలకు

భరత వాక్యమిక పలుక వచ్చని!
విప్లవ వీరుల ఎర్రని రక్తం
చుక్కైనా పడదిక నా ధరిత్రి మీదని!
అనుకొన్నానే కాని - మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంది -
భయం పుట్టిస్తూ ఎర్రెర్రని ఆ రోజు!
రక్తం ఉమ్ముసుకొంటూ - వహ్నిజిహ్వలు చాచుకుంటూ
మళ్ళీ మళ్ళీ వస్తూనే ఉంది!
దేశం మనది - ఇక నుంచీ మనదే దేశం
ప్రజల రాజ్యం ఇది - పరిపాలన మనది
సమత మనది - సామ్యవాదం మనది
ప్రజాస్వామ్య ప్రభుత్వం మనదని అన్నారు.
నిన్నూ నీ దేశాన్నీ ముందుకు నడిపిస్తాడని
నీవు నమ్ముకొన్న వాడిని
ఎన్నుకొనే మహదధికారం
ఉంది సుమా! పరమ సామాన్యుడికి- నీకూ
ఉంది అని అన్నారు!
నీకు విశ్వాసం ఉన్నవాడిని-
నీతికి నిదర్శనంగా నిలుస్తాడని నమ్మినవాడిని
నిరభ్యంతరంగా ఎన్నిక చేసుకొమ్మన్నారు!
అదుగో- అసలు ఆ ఘట్టంలోనే
జరిగిపోయింది - జరగకూడని హత్య!
నీ నాయకుడి మీద నీవు పెంచుకొన్న
విశ్వాసానికి జరిగిన హత్య!
అయాంచితంగా, అతివేలంగా
ఆ మహానాయకుడూ అంతకుముందే
పంచి పెట్టిన వరాల - వాగ్దానాలకు జరిగిన హత్య!

వధ జరిగిపోయింది వరుసగా-
ధర్మానికి - సత్య వచనానికి!
అక్కడినుంచీ ఆరంభం-
రక్తసిక్త రాగాలు! రాజఘాట్ సమాధులు!
నెత్తుట తడిసిన మలిన స్థలాలు! శక్తి స్థలాలు!
బాంబుల ప్రేలుళ్ళు! భీకర విధ్వంసాలు!
నిట్టనిలువునా నిండు ప్రాణం ఎగచిమ్మిన
యువరక్తపు చిమ్మిన గొట్టాలు!
ఓహో! భయం పుట్టిస్తుంది నాకు-
మళ్ళీ మళ్ళీ వచ్చే ఆ ఎర్రెర్రటి రోజు!
ప్రబల హింసా మదోన్మత్తత
పారుతున్నది రక్తమై ధమనుల్లో!
పరమ కిరాతక పిశాచమై - స్వార్థం
ప్రేతంలా విహరిస్తున్నది - మనసుల్లో!
నరహంతను చేస్తున్నది - మనిషిని
ఆరని అధికార లాలస గూడుకట్టి గుండె పొరల్లో!
చిత్రం కదూ! చిత్రాతిచిత్రం కదూ!
ప్రజాస్వామ్యం వేదిక కావడం-
ఈ హింసల ప్రతిహింసల ఉన్మత్త నృత్యానికి!
వెర్రి మొర్రివాడివి నీవు - నరహంతకుడా!
చెరప గలవా నేను నమ్మిన సిద్ధాంతాన్ని-
నన్నీ పృధ్వీమీద లేకుండా చేసినా?
మార్చగలవా సువ్యవస్థిత విధానాన్ని-
వ్యక్తిని చంపే వ్యూహం నీకు తెలిసినా?
దేనికి పరిష్కారం వ్యక్తుల హత్య?
ఏ ఉద్యమం ఆగింది ఎన్ని ఉసురులు తీసినా?

ఆగదు సరికదా - నరహంతకుడా!
రెట్టిస్తుంది ఉద్యమానికి సత్త్వం - స్ఫూర్తి!
కటిక నియంతృత్వాల కళింగ యుద్ధాల
రాజ్యకాంక్షల రక్తదాహాల
రణరంగ ఘోషల వికటాట్టహాసాల
దశలన్నీ దాటుకు వచ్చాం కదా!
మళ్ళీ మరలడం ఎందుకు
భూతంలాంటి ఆ భూతంలోకి!
రండి! చూడండి! ఎంత ఎర్రగా ఉందో!
రక్తం తడిపిన నేలతల్లి!
పువ్వు పూచినా ఈ మట్టిలో
భుగ భుగమని జ్వలించేట్లు ఉంది!
పసిపాప నవ్వినా ఈ గడ్డమీద
వికృత హాసమల్లే వికటించేట్లు ఉంది!
వరివెన్ను పాలు పోసుకున్నా ఈ నేలమీద
కాలకూట విషమయ్యేట్లు ఉంది!
ఇప్పుడు ఈ నా మట్టిని కడగాలి
అవసరంగా! రుధిరస్నాతను ఈ నేలతల్లిని కడగాలి!
అందుకు కావాలి-
కరిగి కరిగి కారే కన్నీళ్ళు!
కారుణ్యం - కారుమబ్బై వర్షించే చన్నీళ్ళు!

# కుటిల ప్రయత్నం

శ్రీ సి. వి. కృష్ణారావు

నాటి అధినేతలు నియంతలు
తమ ఖడ్గాలకు ఆహార్యం చేశారు ప్రజల్ని
చరిత్రలో వేసిన ప్రతి అడుగూ
ప్రజల ప్రతిపత్తికి పట్టంగట్టింది.
అధిపతుల అధిపత్యాన్ని ప్రశ్నించి
ఒక హక్కు-కోసం అహరహం శ్రమించి
అందరికీ అండగా నిలవాలని
అఖిల మానవాళి సల్పింది పోరు
ఒక సరిహద్దు చెరపటానికి
కంచె మీది గుమ్మడి కాయల్లా
రాలినయి తలలు
మనిషి పతాకస్థాయి కెదుగుతూ
మహోన్నత పథగామిగా నడిచాడు
ఆనాడు స్వాతంత్ర్య నినాదంతో ఆకాశం నిండింది-
మేఘాల అంచున మెరుపు తీగల అల్లిక
స్వాతంత్ర్యానికి శ్రీకారం చుట్టింది
చంద్రుడిలో నీడ స్వాతంత్ర్య శ్రీవత్స మనుకున్నాడు
త్యాగాల సోపానంపై సంధించుకున్న హక్కు-
ఒక వీర నారి కళ్ళకద్దుకున్న పసుపుతాడు

ఒక పుణ్య జీవి హృదయానికి చేరువగా చేరిన క్రాస్
నిరంతర భయాందోళనల మధ్య
స్వాప్నిక జాగృతిలో
అవిశ్రాంత అప్రమత్తత
చరిత్రలో ప్రతి పుటనూ తిరగేసి చూడు.
ఈ సమిష్టి ప్రజావళి అభిమతం
క్షీరాబ్ధి జనిత పూర్ణకుంభం
నేడు కంకాళాలహారాలకోసం తెగుతున్న తలలు
సామ్రాజ్య పునఃప్రతిష్టకోసం
సాగిస్తున్న కుటిల ప్రయత్నం
ప్రచ్ఛన్న కీచకులు చెరచిన
ప్రజాభిమతాన్ని పసిగట్టలేం
ఉడికిన మృష్టాన్నం
బుగ్గి పాలౌతుంది.

# విషపుకోర

—డా॥ నాళేశ్వరం శంకరం

ప్రస్తుత ఏకీకృత చీకటి విషపుకోరకు
సూర్యుడైనా రాలిపోవాల్సిందే!
వ్యవస్థ గర్భంలో రూపుదిద్దుకునేవాడికి
భయాన్ని మించిన భయమే మిగులుతుంది
రంపపు కోతలోనే అపజయ పరంపరారంభం
ఎవడి నొదిటిపైనైనా మినుగురు ఆశరాలితే
తమకు తామే తుడ్చేసుకోవాలి
చలనరహిత చీకట్లోంచి నడవకపోవటమే దేశభక్తి
తెగించిన తలను తెంచడమూ దేశభక్తే!
ఇక చీకటిని దాటటమంటే
వల్లకాటిలో తలదాచుకోవడమే!
రాత్రిని దాటటమంటే
కన్నీటి తీరానికి దగ్గర కావడమే -
ప్రజాస్వామ్య కాల్చివేతలు కుర్చీల ఆక్రమణలు
గుర్తున్నవాడి కన్నీ తెలుసు-

అంతటా చొరబడిన పురుగే
ప్రజాస్వామ్య చావులోను చొరబడింది
నా దేశ ప్రజలారా! శ్మశానవాసులారా!
మనది శస్త్ర చికిత్సకు నోచుకోని దేశం
మన ఉన్మాదపు మంట తగిలిన గడ్డివాము ఈ దేశం.

# ఎక్కడుంది ప్రజాస్వామ్యం?!

—డాక్టర్ టి. గౌరీశంకర్

హత్యా రాజకీయాలతో
నిత్యం హోరెత్తే ప్రజాస్వామ్యం!
సత్యం, న్యాయం, ధర్మం మటు
మాయమాయే ఎటు ఈ దేశం గమ్యం!!
ముళ్ళ కంచెలో చిక్కుకొని
బిక్కుమని చూస్తున్నది ప్రజాస్వామ్యం!
గుంటనక్కల ఎత్తుగడలో
కంఠదఘ్నంగా కూరుకుపోయింది ప్రజాస్వామ్యం!!
అలజడుల సుడినడిలో
కొడిగట్టిన ప్రజాస్వామ్యం!
అసహాయ స్థితిలో ప్రజాస్వామ్యం!
అసమర్థుల చేతిలో ప్రజాస్వామ్యం!!
రైలు పెట్టె కంటుకున్న
పెనుమంటల్లో ప్రజాస్వామ్యం!
రాస్తారోకోలో పగిలిన
బస్సు అద్దాల ముక్కల్లో ప్రజాస్వామ్యం!!
కర్ఫ్యూ విధించిన వీధుల్లో
పారే రక్తపు మడుగుల్లో ప్రజాస్వామ్యం!
వాడలలో వాడికత్తి వేటుకు

కూలిన మృతదేహాల్లో ప్రజాస్వామ్యం!!
నగర శివార్లలోనేగాక నడిబొడ్డులో
బందిపోట్లకు దోపిడయ్యే ప్రజాస్వామ్యం!
కిడ్నాపుల్లో హైజాకుల్లో
నిత్యం జరిగే బీభత్సంలో ప్రజాస్వామ్యం!!
పెచ్చరిల్లిపోతున్న గుండాయిజం
ఉచ్చుల్లో బిగుసుకుంది ప్రజాస్వామ్యం!
పూలదండల్లో పెట్టిన బాంబుల్లో
తునాతునకలవుతుంది ప్రజాస్వామ్యం!!
రెచ్చగొడుతున్న అవకాశవాదుల
చిచ్చులో శలభమయ్యే ప్రజాస్వామ్యం!
అంతర్యుద్ధాల అశాంతి నిలయంలో
అంతర్జాతీయ కేడీల వలయంలో ప్రజాస్వామ్యం!!
ఎక్కడుంది ప్రజాస్వామ్యం!?
ఏం చేస్తోంది ప్రజాస్వామ్యం!?
నేతిబీరకాయ ఇది ప్రజాస్వామ్యం!
నీతి తప్పిన ఇది ప్రజాస్వామ్యం !!
గోతులు తవ్వి గోరీలు కట్టి
జాతి పతనానికి ఇది ప్రజాస్వామ్యం!!
పది మందిని పొడిచి చంపితే
పదవి దక్కే ఇది ప్రజాస్వామ్యం!
అల్లర్లను రెచ్చగొడితే
అధికారం చేజిక్కే ఇది ప్రజాస్వామ్యం!!
నడివీధిలో నరికి వేస్తే
చూపిన కళ్ళు సాక్ష్యం
చెప్పలేని పిరికితనం ఇది ప్రజాస్వామ్యం!

మనమధ్యలోనే మానభంగం జరిగితే
అదేమని ప్రశ్నించలేని
అవిటితనం ఇది ప్రజాస్వామ్యం!!
ఇదే కొనసాగితే
(ఎందరు) ఎన్ని జీవులు
ఎందరు రాజీవులు
నేలకొరుగుతారో!
దేశం భవిత ఏం కానున్నదో!!

# అమాయకత్వమే నన్ను ఆకర్షిస్తుంది

డాక్టర్ సుమనశ్రీ

అమాయకత్వమే నన్ను ఆకర్షిస్తుంది
నాలో గులాబీల్ని పూస్తుంది
నాకు తలక్రిందులుగా సముద్రంలో
ఈతకొట్టే తిమింగలాలంటే ఇష్టం
తమకంలో పడవ అడుగున
ప్రేమించుకునే చేపలంటే ఇష్టం
హక్కులో హత్యారాజకీయాలో నాకు తెలీదు
పోరాటాలో పోట్లగిత్తలో నాకు తెలీదు
సిక్కులో సీజర్లో నాకు తెలీదు
మానవత్వం కరువైన
రాజకీయ రాక్షసులంటే నాకసహ్యం
హిట్లర్లనీ హిడింబాసురుల్నీ
శనిగ్రహం మీదికి విసిరేస్తాను
వాళ్ళ గళాల్ని ఖండించి చీకటి
చలి కూజాల్లో కూర్చోబెడతాను
విర్రవీగే విజ్ఞానం మహనీయ మానవుని
ముందు గాండ్రించే గార్దభ సింహం!
బాంబుల పాతర మహామనీషి చేతుల్లో
భూమి అట్టడుగు పొరల్లో

జ్వలిస్తున్న బొగ్గు గనుల్ని రేపుతోంది
మేధస్సును మేధస్సే ఖండిస్తుంది
మనిషిని మనిషే జయిస్తాడు
విచ్చుకత్తులు చీకటి క్షణాల్లో వీరవిహారం చేసినా
ఉదయ కిరణాల ముందు వీగిపోతాయి
వీస్తున్న తుపానులో వాటి తెరచాపలు
చినిగిపోతాయి
పిల్లల ముఖాలపై దోబూచులాడే నిర్మలత్వం
నన్ను నిలదీస్తుంది
రెండుజళ్ళతో కళ్ళముందు తోరణాలు కట్టే
సుందరి మందహాసమే
నా నరాల్లో ప్రాణాన్ని నింపుతుంది.

# రుధిర స్రవంతి

డాక్టర్ అంతటి నరసింహం

ఉఱుములుఱుమక పిడుగులు కురిసినట్లు
స్థిరముగా నుండి అచలకంపించినట్లు
నిర్భయముఁ భద్రభావాన నిద్రమునిగి
జనములుండగ ఘోరమ్ము జరిగిపోయె

*　　　*　　　*

వినగానె గుండె పట్టినది కొట్టుకొనంగ
　　మానిన దుర్భ్రాంతవంతమగుచు
రోదించినది యాత్మ రూక్షబాణాహతిం
　　గూలిన రాయంచ కూనయగుచు
చిందించినది రక్త సేచనమ్ముల నేత్ర
　　ద్వంద్వమ్ము శూలాహతమ్మునగుచు
మొద్దుబారినది సమ్మూర్ఛమై కాయమ్ము
　　విష పత్రికాడిన విధము నగుచు
స్వప్నమందైన నూహింప వలను పడని
విధముగా దొంగచాటు విద్వేషణీ ప్ర
యుక్త బాంబు హఠాత్తుగా హోరుకొట్టి
విజయి రాజీవు చంపుట వినినయంత.

*　　　*　　　*

గాంధీని మతమూఢు డంధుడై పిస్తోలు
　　గుండుచే గుండెల చెండినాడు

ఇందిరాగాంధీనిమందులై మూర్ఖాంగ
రక్షకుల్ మోసాన వచ్చినారు
రాజీవగాంధీని రక్కసి ఒక్కర్తి
ఒడిబాంబు మొగము నుత్తరించె
గూండాల తండాలు ఘోరమ్ముగా జన
ప్రాణాల మానాల వక్కలించె
మంచి వారికినిట్టి దుర్మరణములును
హీనులకు దుష్టులకును సన్మానములును
జరుగుచున్న యీ భారతజాతి యింక
నెట్టి కొత్త విపత్తుల నేమియగునో!

*　　　*　　　*

ఏరురావారు చీకట్ల దూరి దూరి
కిరసనాయిలు డబ్బాలు కేలబూని
కానివారిళ్ళలో చల్లి కాలబెట్టి
బూడిదగ మార్చుచున్న కుబుద్ధులకట!
స్పర్థతో దుష్టసాంఘిక శక్తులెల్ల
ఇదియె సందని జృంభించి రదిగొ చూడు
పార్టియేగాదు. కులమత స్పర్థలెన్నొ
పాతపగలెన్నొ, అన్ని సంయోగమంది
రక్షసేయగ వచ్చిన రక్షకభటు
లకును, గుండాల తండమ్ములకును, దొంగ
బలములకు మధ్య జరిగె సంకుల సమరము
నష్టమింతింత యని చెప్ప కష్టమయ్యె.
దీనికింగారణములు కేంద్రీకృతమ్ము
లైన యాస్తులు అధికారహంకృతులును
కులము వల్లను కలిగిన తలపొగరును
స్థానబలమును స్వార్థదుస్వార్థబలము.

ఏడు వత్సరముల క్రితమిట్టిదొకటి
మూడు సంవత్సరముల క్రితమున మరొకటి
జరిగె నీలాగె పార్టీల కులవిమూఢ
శక్తుల విజృంభణమ్మున సంఘమందు

అవ్యయుడు తీర్చినట్టి కులవ్యవస్థ
యెపుడు నిర్మూలనమ్మగు నపుడు సమస
మాజముత్పన్నమగు నప్పుడే జనించు
స్వార్థరాహిత్య బుద్ధి యీ సంఘమందు

# గురిచూపును ఉరితీసే క్షణం

—శ్రీ దోర్బల బాలశేఖరశర్మ

రావణ కాష్టంలా శవాలు కాలుతున్న వాసన
మట్టినిండా మాంసంతో ఏపుగా పెరిగిన కలుపుమొక్కలు
పిడికిట్లో పిసికేస్తున్న భూగోళంపండులోంచి కారుతున్న
నెత్తుటిధార
అవి రెండు కళ్ళమధ్య రగులుతున్న చితిమంటలు
నాలుగుకాళ్ళు తన్నులాడుకుంటున్న శవరాజకీయాల బంతులు
అక్కడి ఊళ్ళు తలలతో పోట్లాడుకుంటున్న మదమెక్కిన
పొట్టేళ్ళు
నగరాలు రాజకీయ బాకులు దిగేసే మతం కడుపులు
కుట్రల సరిహద్దుల్లో బాంబుల గురిచూపుకు వేళ్ళాడుతున్న
దేశాలు
రాజరికపు చరిత్రను చించుకుంటే నెత్తిమీద శవాలవానై
కురుస్తుంది
ప్రపంచం కాళ్ళు ముందుకు పరుగెడుతుంటే, మొండెం
వెనక్కి వెళ్తోంది-
రాజుల, రారాజుల రాజనీతి విడిచిన కుబుసమే కదా
ఈ రాజకీయం!
పాత కుళ్ళును తెచ్చి పాతిపాతిపెట్టినా .... కొత్త కుళ్ళు
తేలు కొదువ లేకుండా!!
పాలకులు ప్రజలే, పాలితులు ప్రజలే, పాపఫలాలూ ప్రజలే.

వాడి జ్ఞానదంతంతో కొరికితే .... అమృతమేకాదు,
హాలాహలమూ నెత్తి కెక్కుతుంది

కాలం కన్న ప్లాస్టిక్ పువ్వు ఇరవయ్యో శతాబ్దం
ఈ శతాబ్దం తొలిమలుపులో ప్రజాస్వామ్యంతోపాటు
ప్రముఖుల మృత్యువూ పుట్టింది

ఆస్ట్రియా యువరాజు హత్యను పట్టిలాగితే, మొదటి
ప్రపంచ యుద్ధం బావురుమంటుంది

అబ్రహాం లింకన్, అలెగ్జాండర్, మహాత్మా గాంధీ,
ఇందిర, రాజీవ్....

పండును పిసికినట్టు ప్రాణాన్ని పిసికేసే రాక్షస
మానవులకు ఎవరైతేనేం?

బాంబుల్తో నంజుకు తినడానికి —
చిన్న చూపుపట్టే గంతలోంచే విశ్వాన్ని ఎత్తుకుపోయే ఘరానా
బందిపోట్లు

కురుక్షేత్రం ఎప్పుడో నివ్వెరపోయింది, అశోకుడి కళింగ
ఏనాడో మసకబారింది-

జన ఛీత్కారంలో పడి కొట్టుకుపోయాక, అడవులైతేనేం,
ఆత్మాహుతి తనమైతేనేం!?

చరిత్ర పేజీలను కంపుతో నింపడానికి—
జ్ఞాన ప్రణాళికలను హంతకులకు తాకట్టుపెట్టే అజ్ఞాత
మేధావులకు జోహార్....

ప్రమాదాల పొదల మధ్య సంచరిస్తున్న దేశాధినేతలారా
బహు పరాక్....

భద్రమైన భద్రతా వ్యవస్థకు సైతం ఛిద్రాలుంటే
ప్రజాస్వామ్యం ఒలికిపోదా!?

లక్షల డాలర్ల మైకం చేసే తుచ్ఛమైన పనులకే విర్రవీగి
పోకండి॥

కోట్లాది ప్రజల గుండెతీపితో ఆ సమాధిమీద పూచిన పూలకు
చూపు రాకపోదు॥

దాక్కుని దొంగ దెబ్బతీసే దగుల్బాజీ బుద్ధి అప్పుడు
ఉరికంబ మెక్కకపోదు॥

# పారని గుర్రం

—శ్రీ హరిచంద్ర శేఖర్

మా తాతగారు కానుకగా ఇచ్చిన అందాల బొమ్మ
అందర్నీ అలరించింది ఆ రోజుల్లో
దానికిపుడు పోలియో వచ్చింది, క్షయ వచ్చింది
పైబడి ఇటీవల పిచ్చిలేచింది.
ఉన్నట్లుండి ఒక కాలో, చేయో విరుచుకుని
తుపాకిగా పేలుస్తుంది
దాని తలనీలాలు పడగలు విప్పి బుసలు కొడ్తున్నాయి.
దరికి వచ్చిన పరామర్శ కనుగుడ్లను
రిమోట్ కంట్రోల్ స్విచ్ పేల్చేస్తున్నది
అంగుళీకాలెక్కిన అందలం
వితర్క తత్వ సారాంశ ప్రతీక అయింది.
త్యాగానికి, సౌశీల్యతకూ నీరాజనమైన ఓటు
దేశభక్తికీ, నిస్వార్థతకూ జయధ్వానమైన ఓటు
ఓ జన్మహక్కు, ఓ పవిత్ర బాధ్యత
దాపురించిన ఈ పోయేకాలంలో
బస్తీ దాదా కిచ్చే మామూలైంది
గుణంలేని ప్రియురాలి కిచ్చే మల్లె చెండైంది
సుఖరోగ వైద్యుడికిచ్చే రుసుమైంది

హంతకుడి వాదనా సరళి అయింది.
విచిత్సకుడి విశ్లేషణలో
మౌనం నీ నేరం మౌనం నీ రోగం
నిశ్శబ్దావలోకన సుందరీ
తెరమరుగు వీడి తెగువచేసి
నీ గళం విప్పు
హింసా ప్రకరణ ప్రతిఫలం
ఎప్పటికీ విఫల వ్యధా వికిరణమే
అసహ్యాన్ని సహించకు
అనాది నుండి హింస అనర్థానికి వాహనమైంది
అది రౌతును ఎన్నడూ గమ్యం చేర్చదు.

# మానవతకు మాయని మచ్చ

డాక్టర్ మసన చెన్నప్ప

ఆ రోజు
సరాసరి పడకమీంచి లేచి
పెరట్లోకి వెళ్ళాను
పిట్టగోడ మీద
ప్రతిరోజూ ఆడుకొనే
పావురాళ్ళు కనిపించడం లేదు
వాకిట్లోకి గబగబా నడిచి
వీధిలోకి తొంగి చూశాను
విషాదం కల్లాపిగా చల్లినట్లుంది
ఆ వైపు వేపచెట్టును చూశాను
ఆకైనా కదలడం లేదు
ఎవరో శిలువ వేసినట్లు.
ఆకాశాన్ని చూశాను
అంతటా ఎర్రని మరకలు
ప్రభాత సూర్యుడు రక్తం కక్కుతున్నాడు
ఇంట్లోకి నడిచి రేడియో ఆన్ చేశాను
శోకం రాగమై ప్రవహిస్తుంది
అప్పుడే వచ్చిన పేపర్ చూశాను
గుండె ఆగినంత పని-

రాజీవ్ దారుణ హత్య
అది ప్రజాస్వామ్యానికి హత్య
మానవతకు మాయని మచ్చ
గుండాలు నాయకులైతే
గృహ దహనాలకు కొదవేమిటి
రాజకీయం రౌడీమయమైతే
కత్తిపోట్లకు అదుపేమిటి?

# చరిత్ర పుటలనిండా రక్తం మరకలే

శ్రీ జి. కుమారస్వామి నాయుడు

బల్లాలకు నేను భయపడలేదు
అబలలంటే అదిరిపోతున్నాను
ప్రజాస్వామ్యం ఒక పువ్వు
కాపాడుకొంటే పరిమళిస్తుంది దాని నవ్వు
అనాగరికంగా వర్తిస్తే
దుర్భర దుర్గంధభరిత మౌతుందా పువ్వు
చరిత్ర పుటలనిండా రక్తం మరకలే
రాజకీయమంతా రాక్షసత్వమే
అధికార దాహం తీర్చుకోవడానికి
సాగరాన్నైనా వంచిస్తారు
సూర్యుణ్ణైనా హింసిస్తారు

చుక్కల కిరీటం ఎప్పుడూ
చీకటికే దక్కుతూంది
శంఖంలో పోసినంత మాత్రాన
విషం తీర్థం కాదు
అధికారం అంధకార హస్తగతమైతే
ప్రజాస్వామ్యం హత్యగాకమానదు

# నేటి ప్రజాస్వామ్యం జబ్బుకు గురి అయింది

-శ్రీ ఉప్పల గోపాలరావు

"ఎక్కడుంది ప్రజాస్వామ్యం?
రూకల్లో కేకల్లో వుంది."
ఆలోచన నుండి దూరమైంది ప్రజాస్వామ్యం
రాజీవ్ హత్యకు ముందే-ప్రజాస్వామ్యానికి నడుం విరిగింది
ప్రజాస్వామ్యం హత్యకు గురికాలేదు.
ప్రజాస్వామ్యం జబ్బుకు గురి అయింది.
ప్రజాస్వామ్యానికి ఒక రకమైన పక్షవాతం సోకించారు కొందరు
కొన్నాళ్ళక్రితం చేతులకు - తరువాత కాళ్ళకు - యిప్పుడు మనస్సుకు
చాలాకాలం నుండి యిలా ప్రజాస్వామ్యం పక్షవాతానికి గురి అవుతూనే వుంది
ఈ సంగతి ప్రజాస్వామ్యం ముసుగులో
పెత్తనం చేసేవారికి తెలుసు
ఆలోచనా పరులకు తెలుసు - నేడు సామాన్యుడు తెలుసు కున్నాడు అంతే
నేడు నిజమైన ఓటింగు 30 శాతం రిగ్గింగు వగైరా 25 శాతం

మొత్తం 55 శాతం ఓటింగు
నిజంగా 60% ఓటర్లు ఓట్ల పండగ చేసుకోవటంలేదు
ఇదీ! మన ప్రజాస్వామ్య పాలకవర్గం ఏర్పడే తీరు
ప్రజాస్వామ్యం కాదు మనది - రూకల కేకల రాజ్యం యిది
రూకలూ కేకలు చేతులు కలుపుకుని పాలిస్తున్న ప్రజా స్వామ్యం మనది
రూకలు దొంగవి - కేకలు పిచ్చివి - ఆ రెంటి బలం మనకు తెలిసిందే
వాటి బలంముందు ప్రజాస్వామ్యం మోకరిల్లింది
కదలలేదూ - మెదలలేదు.
రూకలనూ-కేకలనూ ఎదురుకునే చైతన్యం ధైర్యం త్యాగం సామాన్య జనానికి కావాలి.
సామాన్య జనం కదిలి - ఆ జబ్బుకు వైద్యం చేపట్టాలి
అప్పుడు ప్రముస్వామ్యం కోలుకుంటుంది
ప్రజాస్వామ్య ఆరోగ్యం కుదుటబడుతుంది
నేడు సామాన్య జనాన్ని కదిలించే నాయకత్వం కావాలి
ఆ బాధ్యతను ఈ రచయితల సమావేశం చేపట్టాలి
అనాది నుండీ పాలక వర్గానికి అండా, దండా
రచయితలూ, రౌడీలే
బలమే మార్చేది - జనంగలవారే మార్చేది
రచయితల బలం తగ్గింది నేడు-రౌడీల బలం పెరిగింది నేడు
తిరిగీ రచయితల బలం పెంచుకుంటే ప్రజాస్వామ్యానికి తిరుగులేదు
ప్రజాస్వామ్యం హత్యకు గురికాలేదు - జబ్బుకు గురి అయింది
ఈ జబ్బుకు వైద్యం చేయటానికి రావాలి రాజ్యం
రచయితల రాజ్యం పోవాలి రాజ్యం రౌడీల రాజ్యం

# రంగు మారిన దేశం!

శ్రీమతి కె. బి. లక్ష్మి

నా దేశం!
ఆకలితో అలమటించి పోతోంది
దాహంతో ఆర్చుకు పోతోంది
నా దేశం!
ఉడికి పోతోంది
మునిగి పోతోంది
నలిగి నాశనమై పోతోంది.
అయినా! ఎవరికీ లక్ష్యం లేదు!
అంతా ఆవురావురు మంటున్నారు
రక్తదాహంతో తపించిపోతున్నారు
ఎవడి పొట్ట వాడిది, ఎవడి వేట వాడిది!
ఎందర్ని పొట్టన బెట్టుకున్నా ఆగని ఆకలి
ఎంత రక్తం తాగినా తీరని దప్పి!
నా దేశం!
ఉడికిపోతోంది
చితికి ఛిద్రమై పోతోంది!
నా దేశంలో
అమాయక ప్రజలు బిక్కచచ్చి పోయారు!
బిక్కుబిక్కుమంటూ భయంతో ఉలికులికి పడుతున్నారు!
నా దేశంలో!

శాంతి కపోతాలు!
మానవత్వం మరచిన నరరూప రాక్షసుల నడుమ
దిక్కుతోచని స్థితిలో
దిక్కులు చూస్తుండేకంటే
మరెవరికయినా సాయపడదామన్న
మంచి మనసుతో, మానవత్వాన్ని వెతుక్కుంటూ....
దిగంతాలకు ఎగిరిపోయాయి!!
నా దేశం!
ప్రపంచ పటంలో
రంగుమారి ఎర్రబారింది!!

# ఉగ్రవేదం – వ్యాఘ్రవాదం

డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య

బస్సులు పద్నాల్గు తగులపెట్టేశాము
బ్యాంకులు పన్నెండు కొల్లగొట్టేశాము
కాల్చేశాం ప్రయాణికుల రైళ్ళను కూల్చి
ప్రజకోసం బ్రతుకు ముడుపు కట్టేశాము
పోలీసులు ప్రజలు కాదు - చంపేస్తాం
అధికారులు ప్రజలు కాదు - చంపేస్తాం
పాలకనాయకులంతా ప్రజలేనా!
చెత్త కాగితాలు వీళ్ళు - చింపేస్తాం
పావురాలు ఎగురొద్దు అడవులన్ని మావే
హంసలు ఇటు రావద్దు చెరువులన్ని మావే
కోట్లువోసి పులిపిల్లల కొనివేశాం మాకేం!
పసులు గడ్డిమేయొద్దు పొలాలన్ని మావే
కలం కాగితాలు ఫైళ్ళు ఇక కదలొద్దు
న్యాయ ధర్మశాసనాలు ఇక నడవొద్దు
తుపాకులూ తూటాలే మా వేదాలు
ప్రజానేత లెవరైతేం ఇక పలుకొద్దు
ఖడ్గాలను కడ్డీలను చదువుకొండి మీరు
గొడ్డళ్ళను గొలుసులనూ జపించండి మీరు
బాంబులు పిస్టళ్ళె మాకు భద్ర దైవతాలు
మనిషి నెత్తు తీర్థంగా పుచ్చుకొండి మీరు.

# వాడిపోదీ మామిడితోట

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

మా యింటిపేరు అంటు మామిడితోట
అంటుతొక్కడమే యిక్కడి సదాచారం
మా యింటి చుట్టూ గుబుర్లు గుబుర్లుగా
కమ్ముకున్న మామిడి తోపుల్లో
సుప్త చైతన్యంలో పొంగుతున్న
జాతి జీవన రాగాలలో
పంచమ స్వరాలు వినిపిస్తూంటాయి.

నాకు మా తాతకాలం నుంచీ బాగా తెలుసు
మేమందరం కలిసి నిద్రలేచి చేసిన యాత్రలు
తాతకు చెట్లజాతుల జీవనాడులు తెలుసు
ఏ జాతి చెట్టుతో ఏ జాతి కొమ్మను
అంటగట్టి అంటుతొక్కాలో ఆంతర్యం తెలుసు
ఈ నేల బలాబలాలు బలేబాగా తెలుసు.

ఆయన అంటు తొక్కుతూనే
కొమ్మ విరిగి కూలిపోయాడు.
నేల భగ్గున మండింది
అతికిన అంట్లల్లో నిప్పురవ్వలు రగిలాయి
కన్నప్పుడల్లా కన్నీళ్ళతో ఆర్పడమే
నా రోజువారీ జీవితంలో
నేను వార్చే సంధ్యలు

అర్పించే అర్ఘ్యాలు !
మా డాడీ మామిడి తోపుల్లో పావురాళ్ళను పెంచాడు
అంతర్జాతీయ పక్షాలను అపూర్వంగా జోడించి
అంబరాలకు ఎగిరించాడు
తెల్ల మబ్బుల్లా వుండే పావురాళ్ళు
ఎర్ర గులాబీల్లా మారిపోయాయి
మామిళ్ళు మాట్లాడుకొనేవి, పోట్లాడుకొనేవి, కొట్లాడుకొనేవి
పంచసూత్రాలు పఠించేవి
పంచ సూక్తాలు వినిపించేవి.
రాళ్ళవాన వస్తుందేమోనని పొలిమేరల్లో
ముక్కులతో చెక్కలు చేస్తామని పావురాళ్ళ అభయం
రోజంతా పనిచేసేవాడు మా డాడీ
సగం మామిళ్ళకోసం; సగం పావురాళ్ళకోసం.
మా అన్నలూ తమ్ముళ్లూ చిరంజీవులూ
అందరూ అందరే-మహానుభావులు
అంతర్జాతీయ వంగడాలను
జాతీయంగా అంటు తొక్కడంలో
అపూర్వ సహోదరులు.
తాతగారు అతికిన అంట్లను చీల్చగలరు, కూల్చగలరు
చెట్లమీది పావురాళ్ళను పెంచగలరు, త్రుంచగలరు
పెంచితే పదికాలాలకుగాని అందదు ఫలం
త్రుంచితే చేతికి అందేది సద్యఃఫలం
అన్నలు మా కందించిన కలం గళం ఈ నిజం
సంప్రదాయంగా వినవస్తున్న సమసమాజం.
వీరికాలంలో తోటరంగు మారింది
పండురుచి మరీ మారింది

ఆనాటి అంటుకు అర్థం మరోలా మారింది
పావురాళ్ల గూళ్ళల్లో పెట్టిన గుడ్లు
చీకట్లోనే కాదు పట్టపగలే మాయమౌతున్నాయి
గులాబీరేకులు జిగురూడి విరిగిపోతున్నాయి.

మా తోటమీద రాబందుల రెక్కల చప్పుడు
మామిళ్ళు పిడికిళ్ళు బిగించి
విప్లవానికి రెపరెపలాడుతున్నాయి
మామిడిపండు రాలిపడితే
మారణాయుధం మోగిన చప్పుడు
పండు పిండితే రసం కాదు రక్తం
పావురాళ్ళ మూల్గుల్లో మృత్యువేదన
తోట తోటగా లేదు
బాట భద్రంగా లేదు.

అయినా,
నేను మా తోటను చూచుకోటానికి
అప్పుడప్పుడూ వెళుతాను
మొన్న వెళ్ళితే అడవిగా మారి వుంది
కొమ్మలు స్టెన్‌గన్స్‌లా పేల్చేస్తా నంటున్నాయ్
పావురాళ్ళ కొడవళ్ళుగా పొడిచేస్తా నంటున్నాయ్
మాట్లాడేటట్లు లేవు
పోట్లాడుతున్నాయి.

సందట్లో సమారాధన
రాబందుల రణగొణధ్వని.

అందరూ అన్నింటికీ తెగించారు
నేనూ గత్యంతరం లేక తెగించాను

నన్ను గన్నుతో ఆహ్వానించాయి

ఒకసారి ముందుకొచ్చి కాల్చాయి
మరొకసారి ఎగురుతూ కాల్చాయి
ఇంకొకసారి మందుపాతరగా కాల్చాయి
మరింకోసారి మనిషిగా పేలి కాల్చాయి
చెట్లకు కట్టి కాల్చాయి
గుట్టకు నెట్టి కాల్చాయి
తరిమి తరిమి కాల్చాయి, ఉరిమి ఉరిమి కాల్చాయి
చివరకు నలుగురిలో చెప్పి కాల్చాయి
ఇంటి కొప్పుకు చిచ్చుపెట్టి కాల్చాయి
ఇలా ఎన్నోసార్లు ఎన్నోరకాలుగా
చచ్చేటట్లు కాల్చి చంపాయి.

అయినా నేను చచ్చానా
అన్నదే అనుమానం!
నేను క్రొత్తగా చంపబడినప్పుడల్లా
నా రక్తంతోపాటు ఒక అంటు మామిడి టెంకె
ఈ నేలలో ఇంకుతుంది
జాతి కన్నీటి జల్లుతో తడిసి మరోతోట మొలుస్తుంది
జాతీయత గుబాళించే మరోపూత పూస్తుంది.
తోట యజమానిని నేను
మర్యాదగా చెపుతున్నాను వినండి—
మరణమృదంగంలా ఒక బాంబు పేల్చామని మురిసిపోకండి
మామిడితోపులా మరోతరం మొలుచుకొస్తోంది
రసం విలువతోపాటు
రక్తం విలువ కూడా తెలిసేటట్లు ప్రతిఘటిస్తుంది!!

# రజతోత్సవాలు జరుపుకుంటున్న 'యువభారతి' ఆశయాలు

☆ సమాజశ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ విలువలను పెంచి పోషించగల సహృదయలోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య, సాంస్కృతిక, సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి ఉద్యమించటం.

☆ సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోను కాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్వికశక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషిని, సందేశాన్ని సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణల ద్వారా, కార్యక్రమాల ద్వారా యత్నించటం.... అంటే రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని సాగించటం.

☆ 'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించటం మంచిది.' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్యవిధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవ విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపించటం.